





# శతకాలు

## భక్తి,జ్ఞాన,నీతి

# వేమన రత్నములు





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120002238

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ ర స్తు.

# వేమన రత్నములు.

## టీకా తాత్పర్య సహితము




పబ్లిషర్సు:

వేంకట్రామ అండ్ కో.,

విజయవాడ - మద్రాసు

1949



[వెల రు 0-4-0

శ్రీ రస్తు

# వేమన రత్నములు.

—(౧)—

## —* మంచి వస్తువులు *—

ఆ. నిక్కమైన మంచి నీల మొక్కటిచాలుఁ
దళుకు బెళుకురాళ్లు తట్టెడేల
చాటుపద్యమిలను జాలదా యొక్కటి
విశ్వదాభిరామ వినుర వేమ. 1

టీ. విశ్వదాభిరామ = లోకమునకు ప్రియమైనవాఁడా, వేమ = వేమా, వినుర = వినుము, నిక్కమైన = నిజమైన మంచినీలము = నీలము అను పేరుగలరాయి. ఒక్కటి, చాలున్ = చాలును తళుకు బెళుకురాళ్ళు = చూచినంతనే భ్రమింపజేయునట్టి మెఱుపుతో గూడుకొన్న రాళ్ళు, తట్టెడు = గంపెడు, ఏల = ఎందుకు, చాటుపద్యము = రసము, భావము, గలిగి విడిగా వ్రాయఁబడు పద్యము, ఇలను = భూమియందు, ఒక్కటి, చాలదా = చాలును.

తా. లోకమునకు ప్రియమైనవాఁడా వేమా! లాభము లేని మెఱుపుతో గూడుకొన్న రాళ్ళు తట్టెడైనను పనికిరావు. రసభావములు గలిగిన చాటుపద్య మొక్కటి చాలినట్టే మంచి నీల మొక్కటి చాలును.

ఆ. గంగగోవు పాలు గంటెఁడైనను జాలుఁ
గడవెఁడైన నేల ఖరముపాలు
భక్తికలుగు కూడు పట్టెఁడేచాలురా విశ్వ. 2

టీ. విశ్వ...వేమ, గంగగోవుపాలు= నల్లనియావుపాలు, గంటెడైనను=గరిటెడైనను. చాలున్=చాలును, కడవెడైన=కుండెడైన, ఏల = ఎందుకు, ఖరముపాలు=గాడిదెపాలు, భక్తి, కలుగు = ఉన్న, కూడు = అన్నము, పట్టెడే = పట్టెడైనను చాలురా = చాలును.

తా. కడవెడు గాడిదెపాల కంటె నల్లని యావుపాలు గరిటెడైనను చాలును. అట్లే భక్తికలిగి పెట్టుఅన్నము పట్టెడేచాలును.

## —: చిత్తశుద్ధి :—

ఆ. చిత్తశుద్ధిగలిగి చేసిన పుణ్యంబు
కొంచెమైన నదియుఁ గొదువకాదు
విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత విశ్వ. 3

టీ. విశ్వ...వేమ, చిత్తశుద్ధి = మనస్సు లోపలను కల్మషము లేకుండ నుండి, చేసిన = ఒనర్చిన, పుణ్యము = మంచికార్యము, కొంచెమైనను, స్వల్పమైనను, అదియు = అది కొదువ కాదు = తక్కువకాదు, విత్తనంబు = బీజము, మఱ్ఱివృక్షంబునకు = మఱిచెట్టునకు, ఎంత = మిక్కిలి తక్కువనుట.

తా. మనస్సులో కల్మషము లేకుండ చేసిన పుణ్యము కొంచెమైనను తక్కువకాదు. అంతపెద్ద మఱ్ఱిచెట్టునకు విత్తన మెంతయుండును?

ఆ. ఆత్మశుద్ధిలేని యాచారమదియేల
భాండశుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజలేలరా విశ్వ. 4

టీ. విశ్వ...వేమ. ఆత్మశుద్ధి=మనస్సు నిర్మలముగా నుండుట, లేని = లేకయున్న, ఆచారము, అది + ఏల=ఎందుకు, భాండశుద్ధి=కుండ కడుగుకొనుట, లేని = లేనట్టి, పాకము = వంట, ఏల=ఎందుకు, చిత్తశుద్ధి లేని, శివపూజ = ఈశ్వరుని గొలుచుట, ఏలరా!

తా. మనస్సు సరిగా లేని వట్టి యాచారమెందుకు ? కుండ కడుగు కొనకుండ వంట చేసికొనుట యేమి బాగుండును ? అట్లే చిత్తశుద్ధి లేని శివపూజ యెందుకు ?

## —: సజ్జనుడు :—

ఆ. మిరెపగింజ చూడ మీఁద నల్లగనుండు
గొఱికిచూడ లోనఁ జుఱుకు మనును
సజ్జనులగువారి సారమిట్లుండురా విశ్వ. 5

టీ. విశ్వ... వేమ — మిరెపగింజ, చూడ = చూచిన, మీఁద = పైన, నల్లగనుండు; కొఱికి చూడ = కొఱికిచూచిన, లోన = లోపల, చుఱుకు మనును = మంట పెట్టును; సజ్జనులు = మంచి పురుషులు; అగువారి = అయినవారి; సారము = బలము, ఇట్లుండురా = ఇటులుండును.

తా. మిరెపగింజ చూపులకు చిన్నదిగా నుండ, కొఱికినచో నెట్లు కారముగ నుండునో, యట్లే సజ్జనులు పైకి కనఁబడక యుందురు.

ఆ. మృగమదంబు చూడ మీఁద నల్లగనుండు
బరిఢవిల్లుదాని పరిమళంబు
గురువులైన వారిగుణములీలాగురా విశ్వ. 6

టీ. విశ్వ... వేమ; మృగమదంబు = కస్తూరి, చూడ = చూడఁగా, మీఁద = పైన, నల్లగనుండు = నల్లగానుండును, దాని = దానియొక్క, పరిమళంబు = సువాసన, పరిఢవిల్లు = ప్రకాశించును, గురువులైనవారి = సజ్జనులగువారి. గుణములు = గుణములు, ఈలాగురా,

తా. కస్తూరి పైకి నల్లగ నున్నను దాని మంచి వాసన యెట్లు ప్రకాశించునో యట్లే సజ్జనుల గుణములు కూడ అణఁగి యుండును.

## —: అల్పుడు — సజ్జనుడు :—

ఆ. అల్పుఁడెపుడుపల్కు నాడంబరముగాను
సజ్జనుండు పల్కుఁ జల్లగాను
కంచు పలికినట్లు కనకంబు పలుకునా విశ్వ. 7

టీ. విశ్వ...వేమ అల్పుఁడు = హీనగుణము కలవాఁడు; ఎపుడు = ఎప్పుడు, ఆడంబరముగాను = బడాయితో. పల్కును = పలుకును, సజ్జనుండు = మంచిగుణము కలవాఁడు చల్లగాను = శాంతముతో, పల్కును = పల్కును, కంచు, పల్కినట్లు = మ్రోగినట్టు, కనకంబు = బంగారము. పలుకునా ?

తా. కంచు ధ్వనించునట్లు బంగారము ఏట్లా ధ్వనియివ్వదో అట్లే గుణహీనగుణములుకల వాఁడు డంబములు చెప్పునట్లు, మంచిగుణములుకల వాఁడు చెప్పడు.

ఆ. నిండునదులపాఱు నిలిచి గంభీరమై
వెఱ్ఱివాగు పాఱు వేగబొర్లి
అల్పుఁడాడురీతి నధికుండు నాడునా విశ్వ. 8

టీ. విశ్వ...వేమ, నిండునదులు = బాగుగా జలముతో నిఁడియున్న నదులు, పాఱు = ప్రవహించును, నిలిచి, గంభీరమై = గంభీరముగ, వెఱ్ఱి వాఁగు = చిన్నప్రవాహము పాఱు, వేగ = శీఘ్రముగా, పొర్లి, అల్పుఁడు = హీనగుణము కలవాఁడు, ఆడ రీతి = పలుకువిధమున, అధికుఁడు = గొప్ప వాఁడు, ఆడునా ?

తా. చిన్న చిన్న ప్రవహములు శీఘ్రగతిని పొర్లుచు ప్రవహించును. నిఁడునది గంభీరముగా నిలిచి యుండును. అట్లే అల్పుఁడు పలికినట్లు అధికుఁడు పలుకడు.

ఆ. గంగపాఱు నెపుడు గదలని గతితోడ
ముఱికివాఁగుపాఱు మ్రోఁతతోడ
బెద్ద పిన్నతనము పేరిమి యీలాగు విశ్వ. 9

టీ. విశ్వ...శేమ-గంగ = గంగానది, ఎప్పుడు, కదలని = చలనములేని, గతితోడ = నడకతోడ, పాఱున్ = పాఱును, ముఱికివాగు= మురికివాగు, మ్రోతతోడ = చప్పుడతోడ, పాఱు, పెద్దపిన్నతనము తెలిమి=అల్పులకును, సజ్జనులకుండు భేదము ఇట్లేయుండును.

తా. గంగానది చలనములేకుండ బ్రవహించును. ముఱికివాగు ధ్వనితో బ్రవహించును పెద్దపిన్నలకు భేదమిట్లే యుండును.

—: ఉత్తముఁడు. :—

ఆ. నేరనన్నవాఁడు నెరజాణ మహిలోన
నేర్తునన్నవాఁడు నిందఁజెందు
ఊరకున్నవాఁడె యుత్తమయోగిరా విశ్వ. 10

టీ. విశ్వ...శేమ; నేరనన్నవాఁడు = తెలియదని చెప్పువాఁడు: నెరజాణ = మంచి తెలివిగలవాఁడు: నేర్తునన్నవాఁడు=సర్వము తెలియునని చెప్పువాఁడు; నిందఁజెందు=అపవాదుబొందును, ఊరకున్నవాఁడె = ఏమియుఁ దెలియదని చెప్పువాఁడే ఉత్తమయోగిరా = మంచియోగి,

తా, తెలియదని చెప్పువాఁడే మంచితెలివికలవాఁడు. తెలియునని చెప్పువాఁడు నిందబొందును. యేమియు దెలియదని యూరకుండువాఁడే యుత్తముఁడు

—: పిఱికివాఁడు :—

ఆ. మేడిపండు చూడ మేలిమైయుండును
బొట్టవిచ్చి చూడఁ బురుగులుండు
బిఱికివాని మదిని బింకమీలాగురా విశ్వ. 11

టీ, విశ్వ...వేమ, మేడిపండు, చూడ = చూచిన, మేలిమైయుండును = బాగుగా నుండును, పొట్ట=కడుపు విచ్చి = తెఱచి, చూడ పురుగులుండు = పురుగులుండును, పిఱికివాని = పిఱికివాని యొక్క మదిని = మనస్సులోపల బింకము-గట్టితనము ఈలాగురా

తా, మేడిపండు పైకి బాగుగానుండి లోపల పురుగులుండునట్లే పిరికివాని మనస్సులో గట్టితనమట్లేయుండును.

—:గుణము:—

ఆ. పూజకన్న నెంచ బుద్ధి నిదానంబు
మాటకన్న నెంచ మనసు దృఢము
కులముకన్న మిగుల గుణము ప్రధానంబు విశ్వ. 12

టీ, విశ్వ...వేమ, పూజకన్న = పూజకన్న, ఎంచ = ఆలోచించగా, బుద్ధి = బుద్ధి, నిదానంబు = మంచిది మాటకన్న, నెంచ, మనస్సు, దృఢము = గట్టిగి. కులముకన్న = జాతికన్న గుణము, ప్రధానము = ముఖ్యము.

తా. పూజకన్న బుద్ధి నిదానముగా నుండవలెను. మాటకన్న మనస్సు దృఢముగా నుండవలయును. కులముకన్న గుణము ప్రధానమై యుండవలయును.

—: సద్గుణుడు – దుర్గుణుడు. :—

క. కులములోన నొకడు గుణవంతు డుండిన
గులము వెలయు వాని గుణముచేత
వెలయు వనములోన మలయజమున్నట్లు విశ్వ. 13

టీ. విశ్వ...వేమ, కులములోన = వంశములోన, ఒకడు, గుణవంతుడు = మంచిగుణములు గలవాడు, ఉండిన = ఉన్నచో, కులము, వెలయును = ప్రకాశించును, వెలయు = ప్రకాశమానమైన వనములోన = వనమందు, మలయజము = చందనవృక్షము, ఉన్నట్లు = ఉన్నవిధమున.

తా. వనములో చందనవృక్షమున్నట్లు సద్గుణవంతునిచే కులము ప్రకాశించును.

ఆ. కులములోన నొకడు గుణహీనుడుండిన
గులము చెడును వాని గుణమువలన
వెలయు జెఱకునందు వెన్ను వెడలినట్లు విశ్వ. 14

టీ. విశ్వ...వేమ, కులములోన=కులమునందు గుణహీనుఁడు = దుర్గుణుఁడు, ఉండిన=ఉన్నచో, వానియొక్క, గుణమువలన=గుణము చేత, కులము, చెడును = నశించును, వెలయు=ఒప్పునట్టి, చెఱకునందు, వెన్ను = పూవు, వెడలినట్లు = బయలుదేరినట్లు.

తా. చెఱకునందు వెన్నుబయలుదేలినట్లు కులములోన గుణహీనుఁడున్నచో వానిమూలమున కులము చెడును.

ఆ. ఉత్తముని కడుపున నోగుజన్మించిన
వాఁడె చెఱుచు వాని వంశమెల్ల
జెఱకు వెన్ను పుట్టి చెఱుపదా తీపెల్ల విశ్వ. 15

టీ. విశ్వ...వేమ, ఉత్తముని కడుపున = మంచివాని కడుపున ఓగు = చెడ్డవాఁడు, జన్మించిన = పుట్టిన, వాఁడే, వాని = వానియొక్క, వంశమెల్ల = కులమెల్ల, చెఱుచు, చెఱకు = చెఱకున, వెన్నుపుట్టి, తీపెల్ల = తీపినెల్ల, చెఱుపదా = చెఱుచును.

తా. చెఱకున వెన్నుబుట్టి తీపినంతయు చెఱచునట్లు మంచి కులమున చెడ్డవాఁడు బుట్టి ఆకులమును జెఱచును.

ఆ. రాముఁ డొకఁడుపుట్టి రవికులమీడేర్చె
కురుపతి జనియించి కులము జెఱిచె;
ఇలను బుణ్యపాప మీలాగు గాదొకో విశ్వ. 16

టీ. విశ్వ...వేమ రాముఁడు = రాముఁడనువాఁడు, ఒకడు, పుట్టి= జనియించి, రవికులము = సూర్యకులమును, ఈడేర్చె = వృద్ధిఁబొందించెను. కురుపతి=కౌరవులలో పెద్దవాఁడైన దుర్యోధనుఁడు, జనియించి = పుట్టి కులము, జెఱిచె = జెఱిచెను. ఇలను = భూమిపై, పుణ్యపాపములు = పుణ్యమును, పాపమును, ఈలాగున = ఈలాగున, కాదొకో = కాదా !

తా. శ్రీరాముఁడు జనించి రవికులమునకు కీర్తిదెచ్చెను, దుర్యోధనుఁడు జనించి కురుకులమునకు నాశనము గూర్చెను. పుణ్యపాపము లిట్లే యుండును.

—: కు త్సి తు ( డు :—

ఆ. వేరుపురుగుజేరి వృక్షంబు జెఱుచును
జీడపురుగుజేరి చెట్టు జెఱచు,
గుత్సితుండుచేరి గుణవంతు జెఱచురా విశ్వ. 17

టీ. విశ్వ... వేమ. వేరు పురుగు = వేరునందు, పురుగు చేరి, వృక్షంబు = చెట్టును, చెఱుచును. చీడపురుగు = చీడపురుగు, చేరి, చెట్టు చెఱచు, కుత్సితుండు = దుర్గుణములు కలవాడు, చేరి, గుణవంతు = మంచి గుణములు కలవానిని, చెఱుచురా = చెఱుచును.

తా. పురుగు వేరునజేరి వృక్షమును జెఱుచునట్లును, జీడపురుగు పాదును జెఱచునట్లును, చెడ్డగుణములుగలవాడు మంచివానిజేరి చెఱుచును.

ఆ. హీనగుణమువాని నిలుసేర నిచ్చిన
ఎంతవానికైన నిడుమ గలుగు;
ఈఁగ కడుపుజొచ్చి యిట్టట్టు సేయదా విశ్వ. 18

టీ. విశ్వ... వేమ, హీనగుణమువాని = హీనగుణము కలవానిని. ఇల్లు = ఇల్లును, సేరనిచ్చిన = ప్రవేశపనిచ్చిన, ఎంతవానికైన = ఎటువంటి వానికైన, ఇడుము = బాధ, కలుగు = కలుగును, ఈఁగ, కడుపుజొఁచ్చి = కడుపునఁ బ్రవేశించి, ఇట్టట్టు = తలకిందుగా, సేయదా = చేయును.

తా. దుర్గుణుని ఇల్లు చేరనిచ్చినచో నెంతటివానికైనను, ఈఁగ కడుపుఁ బ్రవేశించి బాధ కలుగఁజేయునట్లు బాధకలుగును.

—: హీ ను ( డు :—

ఆ. హీనుఁ డెన్ని విద్య లిలను నేర్చినఁగాని
ఘనుఁడుగాడు హీన జనుఁడె గాని
పరిమళమును మోయ గార్ధభము గజమౌనె విశ్వ. 19

టీ. విశ్వ... వేమ, హీనుఁడు, ఎన్నివిద్యలను = ఎన్ని చదువులను, నేర్చినగాని = నేర్చుకొన్న గాని, ఘనుఁడుగాడు = గొప్పవాఁడుగాడు హీనజనుఁడె = హీనుఁడే కాని, పరిమళములు = సువాసన ద్రవ్యములు, గార్ధభము _ గాడిదె, మోయ = మోసినచో గజమౌనె = ఏనుఁగౌనా ?

తా. హీనుఁ డెన్నివిద్యలు నేర్చినను హీనుఁడేగాని గొప్పవాఁడు కాడు. సువాసన ద్రవ్యములు మోసినంతనే గాడిద యేనుఁగుగాదు.

ఆ. విద్యలేని వాఁడు విద్యాధికుల చెంత
నుండినంత బండితుండు కాడు
కొలని హంసలకడఁ గొక్కెర యున్నట్లు విశ్వ. 20

టీ. విశ్వ... వేమ, విద్యలేనివాఁడు = చదువులేనివాఁడు, విద్యాధికుల చెంత = చదువుకొన్నవారిదగ్గర, ఉండినంత = ఉన్నంతనే, పండితుఁడు కాడు, కొలని హంసలకడ = సరస్సులోనుండు హంసలదగ్గర, కొక్కెర = కొంగ, యున్నట్లు = యుండినట్లు.

తా. హంసల కడ కొంగయున్న విధమున, చదువులేనివాఁడు చదువుకొన్నవాని దగ్గరనున్న మాత్రమునఁ బండితుఁడు కాడు.

—: అ ల్పు ఁడు :—

ఆ. అల్పజాతివాని కధికారమిచ్చిన
దొడ్డవారినెల్ల దోలి తిరుగుఁ
జెప్పుదినెడి కుక్క చెఱకు తీపెఱుఁగునా విశ్వ. 21

టీ. విశ్వ... వేమ, అల్పజాతివానికి = నీచకులమువానికి, అధికారము = ఉన్నతమైన పదవిని, ఇచ్చిన = ఇచ్చినచో, దొడ్డవారినెల్ల = మంచివారినందరిని, దోలి = వెళ్ళగొట్టి, తిరుగున్ = తిరుగును, చెప్పుదినెడి కుక్క = చెప్పుముక్కలుతినములు కుక్క. చెఱకు = చెఱకుయొక్క, తీపి = తియ్యదనము ఎఱుఁగునా = ఎఱుఁగదు.

తా. అల్పునకు అధికారమిచ్చినచో మంచివారిని వెళ్ళగొట్టును చెప్పులతిను కుక్క చెఱకుతీపి నేమి యెఱుంగును.

ఆ. అల్పుఁడైన వాని కధికభాగ్యము గల్గ
దొడ్డవారిఁ దిట్టి తొలఁగఁ గొట్టు
అల్పజాతి మొప్పె యధికుల నెఱుఁగునా విశ్వ. 22

టీ. విశ్వ... వేమ, అల్పుఁడైనవానికి = అల్పునకు, అధికభాగ్యము = ఎక్కువభాగ్యము, కల్గ = కలిగిన దొడ్డవారిన్ = మంచివారిని, తిట్టి = దూషించి, తొలఁగొట్టు = వెడలఁగొట్టును, అల్పజాతి = నీచకులమునందు బుట్టిన, మొప్పె = మూర్ఖుఁడు, అధికుల = గొప్పవారిని, ఎఱుఁగునా = ఎఱుఁగఁడు.

తా. అల్పునకు భాగ్యము కలిగినచో మంచివారిని దిట్టి వెడల గొట్టును. నీచకులమునబుట్టిన మూర్ఖుఁడు, అధికుల నెఱుఁగజాలఁడు.

ఆ. ఎద్దుకైనఁగాని యేడాది తెల్పిన
మాటదెలిసి నడచు మర్మమెఱిఁగి
మొప్పె తెలియలేడు ముప్పదేండ్లకునైన విశ్వ. 23

టీ. విశ్వ... వేమ, ఎద్దుకైనఁగాని = ఎద్దుకైనను, యేడాది = ఒక సంవత్సరము, తెల్పిన = తెలిపినచో, మాటదెలిసి = మాటలు గ్రహించి, నడుచు = నడచును, మర్మమెఱిఁగి = రహస్యమును కనుగొని, మొప్పె = మూర్ఖుఁడు, ముప్పదేండ్లకునైన = ముప్పది సంవత్సరములకైనను, తెలియలేడు = ఎఱుఁగలేడు.

తా. ఎద్దుకైనను ఒక సంవత్సరము తెలిపినచో మాటలు గ్రహించి యది నడచునుగాని, మూర్ఖుఁడు ముప్పదేండ్లకైనా తెలియలేడు.

ఆ. ఎలుకతోలుదెచ్చి యేడాది యుతికిన
నలుపు నలుపెగాని తెలుపురాదు
కొయ్యబొమ్మఁదెచ్చి కొట్టిన బలుకదు విశ్వ. 24

టీ. విశ్వ... వేమ-ఎలుకతోలు = ఎలుకయొక్క చర్మమును. తెచ్చి, ఏడాది = ఒక సంవత్సరము, ఉతికిన=ఉతికినను, నలుపు = నలుపే గాని, తెలుపు గాదు= తెలుపుబడదు, కొయ్యబొమ్మన్ = కొయ్యబొమ్మను, తెచ్చి = తీసికొనివచ్చి. కొట్టిన = కొట్టినచో, పలుకదు = మాటలాడదు

తా. కొయ్యబొమ్మను దెచ్చి కొట్టినచో పలుకని విధమున, ఎలుక చర్మము ఒక సంవత్సరము ఉతికినను తెల్లబడదు.

—: ఖలుఁడు :—

ఆ. పాముకన్న లేదు పాపిష్టి జీవంబు
అట్టిపాము చెప్పినట్టు వినును
ఖలుని గుణము మాన్ప ఘనులెవ్వరును లేరు విశ్వ. 25

టీ. విశ్వ... వేమ-పాముకన్న = సర్పముకంటె, లేదు, పాపిష్టి = పాపము జేసికొనిన, జీవంబు = జంతువు. అట్టిపాము = అటువంటిపాము, చెప్పినట్టు = చెప్పినప్రకారమే, వినును, ఖలుని = నీచునియొక్క, గుణము = బుద్ధి, మాన్ప = మాన్పదగిన, ఘనులు = గొప్పవారు, ఎవ్వరును లేరు.

తా. పాపపు జంతువైన పాము చెప్పినట్లు వినునుగాని, ఖలుని గుణము మాత్ర మెవ్వరును మాన్పఁజాలరు.

ఆ. వేముపాలుఁబోసి ప్రేమతోఁ బెంచిన
జేఁదు విఱిగి తీపు చెందబోదు,
ఓగు నోగెఁగాక యుచితజ్ఞుఁడెటులౌను విశ్వ. 26

టీ. విశ్వ... వేము, వేపచెట్టు, పాలుఁబోసి = పాలనుబోసి, ప్రేమతో = ప్రీతితో, పెంచిన = పెంచినను, చేఁదు = చేఁదుతనము, విఱిగి = పోయి తీపి = తీపితనము, చెందబోదు, ఓగు = చెడ్డవాఁడు, ఓగెఁగాక = చెడ్డవాఁడె, ఉచితజ్ఞుఁడు = తెలివికలవాఁడు, ఎటులౌను=ఎట్లౌను.

తా. పాలుపోసి పెంచినను వేపచెట్టు తన చేఁదును విడువనట్లు చెడ్డవాఁడు చెడ్డవాఁడే యగును గాని మంచివాఁడెట్లగును?

ఆ. పాలుపంచదార పాపరపండ్లలో
జాలఁబోసివండఁ జవికిరాదు
కుటిలమానవులకు గుణమేల గల్గురా విశ్వ. 27

టీ. విశ్వ... వేమ, పాలు, పంచదార, పాపరపండ్లలో = అవి (అవి యొకవిధమైన చేఁదుపండ్లలో) చాలన్ = ఎక్కువగా, పోసి వండన్ = వండినను, జవికిరాదు = రుచికలుగదు, కుటిలమానవులకు = ఖలులకు, గుణమేల = గుణ మెట్లు, కలుగురా = కలుగును.

తా. చేఁదుపండ్లలో పాలు పంచదారపోసి వండినను రుచికలుగనట్లు కుటిలులకు మంచి గుణమురాదు.

ఆ. ముష్టి వేపచెట్టు మొదలంట ప్రజలకు
బరగ మూలికలకుఁ బనికివచ్చు
నిర్దయాత్మకుండు నీచుఁడెందులకొను విశ్వ. 28

టీ. విశ్వ... వేమ- ముష్టిచెట్టును, వేపచెట్టు = వేపచెట్టును, మొదలంట = మొదటివరకును, ప్రజలకు = జనులకు, పరగ = ఒప్పఁగా, మూలికలకు = ఔషధములకు పనికివచ్చు = ఉపయోగపడును, నిర్దయాత్మకుండు = దయలేనివాఁడు, నీచుఁడు = నీచగుణముకలవాఁడు, ఎందునకొను = ఎందులకు బనికివచ్చును.

తా. ముష్టియు వేపయు మూలికలకు బనికివచ్చును గాని నీచుఁ డెందుకు బనికిరాఁడు.

ఆ. కానివానితోడ గలిసి మెలఁగుచున్నఁ
గానివానిగాదె కాంతురవని
దాటి క్రింద బాలు త్రాగిన చందమా విశ్వ. 29

టీ. విశ్వ... వేమ-కానివానితోడన్ = గౌరవము లేనివానితోడ కలిసి, మెలఁగుచున్న = తిరుగుచున్న, కానివానిగాదె = గౌరవము లేని

వానిగనే, కాంతురు = మూతురు, అవని = భూమిని, తాటిక్రింద = తాటిచెట్టుక్రింద, పాలుతాగిన చందమూ = తాగినట్లగును.

తా. చెడ్డవానితోఁగలిసి తిరుగుచున్నచో తాటిచెట్టుక్రింద పాలు తాగినట్లే యగును.

—♦ నిలువ దగనిచోటు ♦—

ఆ. పాల నీడిగింటఁ గ్రోలుచునుండెనా
మనుజులెల్ల గూడి మద్యమండ్రు
నిలువఁదగనిచోట నిలువ నిందలువచ్చు విశ్వ. 30

టీ. విశ్వ... వేమ-పాలన్ = పాలను, ఈడిగింట = ఈడిగింటిలో, (కల్లుఅమ్మువారి కులము) గ్రోలుచుండెనా = తాగుచున్నచో. మను జులు = మనుష్యులు. ఎల్ల = అందఱు. కూడి = ఏకమై, మద్యమండ్రు = తాగుడందురు, నిలువఁదగని = నిలువకూడని, చోట, స్థలమున, నిలువ = నిలుచున్నచో. నిందలు అపవాదులు, వచ్చు – వచ్చును.

తా ఈడిగింట పాలుతాగినను లోకులు దానిని మద్యమే యందురు. అందుచేత ఉండగూడని స్థలమున నున్నచో నిందవచ్చును.

—♦ తా మ స ము ♦—

ఆ తామసించి చేయఁదగదెట్టి కార్యంబు
వేగిరింప నదియు విషమమగును
బచ్చికాయఁ దెచ్చి పండవేయ ఫలమౌనె విశ్వ. 31

టీ. విశ్వ... వేమ-తామసించి = కోపించి. చేయఁదగదు = చేయ కూడదు, ఎట్టికార్యంబును = ఏకార్యమైనను, వేగిరింప = తొందరపడినచో, అదియు = అదియుకూడ. విషమమగును = వ్యతిరేకమగును, పచ్చికాయ, తెచ్చి, పండవేయ = పండవేసినయెడల, ఫలమౌనె = ఫలమగునా ?

తా. ఏకార్యమైనను కోపముచేతగాని, తొందరపడిగాని చేసినచో ది చెడును. బచ్చికాయను పండవేసినచో ఫలమగునా ?

## —♦ కోపము ♦—

ఆ. కోపమునను ఘనత కొంచెమైపోవును
గోపమునను మిగుల గోడుగలుగు
గోపమడఁచెనేని గోర్కులు నీడేఱు విశ్వ.

టీ. విశ్వ... వేమ-కోపమునను = కోపముచేత, ఘనత = గొప్పతన
కొంచెమైపోవును = తగ్గిపోవును, = కోపమునను కోపముచేత మిగుల
మిక్కిలి, గోడు = అల్లరి, కలుగు = కలుగును, కోపము = కోప
అడఁచెనేని = అడఁచినచో, కోర్కులు, ఈడేఱు = సమకూడును.

తా. కోపము వలన గొప్పతనము పోవును. దానిచేత అల్లరి కలు
అది అడఁచుకొన్నచో, నన్నికోర్కులు తీరును.

## —♦ స్థానబలిమి ♦—

ఆ. నీళ్ళమీఁద నోడ నిగిడితిన్నఁగ బ్రాకు
బైట మూరెఁడైనఁ బాఱలేదు
నెలవుతప్పుచోట నేర్పరి కొఱగాడు విశ్వ.

టీ. విశ్వ... వేమ-నీళ్ళమీఁద = నీటిపైన, ఓడ = ఓడ, ని
తిన్నఁగ = సరిగా, ప్రాకును = ప్రాకును, బైట = ఈవల, మూరెఁ
పాఱదు = పోలేదు, నెలవు = తనస్థలము, తప్పుచోట, నేర్పరి =
నేర్పరివాఁడైనను కొఱగాడు = పనికిరాడు.

తా. ఓడ నీటిమీఁద చక్కఁగ నడచును. ఈవల మూరెఁడై
పోలేదు. అట్లే దన నెలవుదప్పినచో బుద్ధిమంతుఁడైనను పనికిరాడు.

ఆ. నీళ్ళలోన మీను నిగిడి దూరముపాఱు
బైట మూరెఁడైన బాఱలేదు
స్థానబల్మిగాని తన బల్మికాదయా విశ్వ.

టీ. విశ్వ... వేమ-నీళ్ళలోన = నీటియందు, మీను = చేప, నిగిడి, దూరము, పాఱు = పోవును, బైట = ఈవల, మూరెడైనపాఱలేదు. పోలేదు, స్థానబల్మి = తానున్న స్థలముయొక్క బలము, కాని, తనబల్మి = తన యొక్క బలము, కాదయా = కాదు.

తా. నీటిలో చేప యెంతదూరమైనను పోవును ఈవల మూరెడైనను పోలేదు. స్థానబల్మియే కాని తన బల్మి కాదు.

ఆ. నీళ్ళలోన మొసలి నిగిడి యేనుఁగుఁదీయు
బైట కుక్కచేత భంగపడును
స్థానబల్మిగాని తనబల్మి కాదయా విశ్వ. ౩౫

టీ. విశ్వ... వేమ-నీళ్ళలోన = నీటియందు, మొసలి, నిగిడి, ఏనుఁగుఁ = ఏనుఁగును, తీయు = లాగును, బైట, కుక్కచేత, భంగపడును, స్థానబలిమి = తానున్న స్థలబలము, కాని, తన బలిమి = తన బలము, కాదయా = లేదు

తా. నీటిలో నున్నంతవఱకు మొసలి యేనుఁగును లాఁగగలదు. ఈవలకు వచ్చినచో కుక్కచేత భంగమొందును. స్థానబల్మియే కాని తన బలిమి కాదు.

—♦ కలిమి ♦—

ఆ. కులములేనివాఁడు కలిమిచే వెలయును
గలిమి లేనివాఁడు కులము దిగును
గులముకన్న భువిని గలిమి యెక్కువసుమీ విశ్వ. ౩౬

టీ. విశ్వ... వేమ. కులములేనివాఁడు = కులము తక్కువవాఁడు, కలిమిచే = భాగ్యముచే వెలయును = ఒప్పును కలిమిలేనివాఁడు = భాగ్యములేనివాఁడు, కులము, దిగును, కులముకన్న, భువి = భూమియందు, కలిమి = భాగ్యము, ఎక్కువ సుమీ.

తా. కులహీనుఁడు భాగ్యముచేత నొప్పును. భాగ్యహీనునకు కులమొందును. కులముకన్న సంపదయే యెక్కువ.

ఆ. కులము గలుగువాఁడు గోత్రంబు గలవాఁడు
విద్యచేత విఱ్ఱవీగువాడు
పసిఁడిగల్గువాని బానిస కొడుకులు విశ్వ. 37

టీ. విశ్వ... వేమ. కులముగలుగువాఁడు = మంచికులముగలవాఁడు, గోత్రంబుగలవాఁడు = మంచిగోత్రము గలవాఁడు, విద్యచేత = చదువు చేత, విఱ్ఱవీగువాఁడు = గర్వించువాఁడు. పసిడి = బంగారము, గల్గు వాని = ఉన్నవాని. బానిస కొడుకులు = దాసీపుత్రులు.

తా. మంచికులగోత్రములుగలవాఁడును విద్యగలవాఁడును ద్రవ్య వంతునకు దాసీపుత్రులని తలంపవలయును.

ఆ. కనియు గానలేడు కదలింపఁడానోరు
వినియు వినఁగలేడు విస్మయమున
సంపద గలవాని సన్నిపాతంబిది విశ్వ. 38

టీ. విశ్వ... వేమ, కనియు = చూచియు. కానలేడు = చూడలేడు, కదలింపఁడు = కదలింపడు. ఆనోరు = నోటిని, వినియు, వినగలేడు, విస్మయమున = ఆశ్చర్యమున. సంపదగలవాని = ద్రవ్యవంతుని, సన్నిపాతంబు = సన్నిపాతగుణము, ఇది.

తా. చూడకపోవుటయు మాట వినిపించుకొనక పోవుటయు కలిమిగలవానికున్న సన్నిపాతగుణములు.

## —: లో భి :—

ఆ. గొడ్డుటావుఁ బిదుకఁ గుండ గొంపోయిన
పాలనీక దన్నుఁ బండ్లు రాల
లోభివానినడుగ లాభంబు లేదయా విశ్వ. 39

టీ. విశ్వ...వేమ, గొడ్డుటావును=గొడ్డావును, పిదుకన్ = పిదుకుటకు, కుండ, కొంపోయిన = తీసుకొనివెళ్ళిన, పాలనీక = పాలీయక, పండ్లురాల = పళ్ళూడ, తన్నున్=తన్నును, లోభివానిన్ = లోభివానిని, అడుగ = అడిగినందువలన, లాభంబు = సార్థకము, లేదయా = లేదు.

తా. గొడ్డుటావును పిదుకుటకు కుండతీసుకొనివెళ్లిన పాలీయక తన్నునట్లు లోభిని యాచించినచోఁ బ్రయోజనము లేదు.

ఆ. మేఁక కుతికఁబట్టి మెడచన్ను గుడువఁగా
ఆఁకలేలమాను నాశగాక
లోభివానినడుగ లాభంబులేదయా విశ్వ. 40

టీ. విశ్వ...వేమ, మేక=మేకయొక్క, కుతిక = గొంతుక, పట్టి = పట్టుకొని, మెడచన్ను = మెడచన్నును, కుడువఁగా = కుడిచినచో, ఆకలి ఏలమాను, ఆశ గాక = వట్టియాశయే గాని, లోభివాని, యడుగ, లాభంబు లేదయా.

తా. మేక మెడచన్ను బట్టుకొని కుడిచిన నాకలి తీరనట్లు, లోభివాని నడిగినందువలన ప్రయోజనము లేదు.

ఆ. ఏమి గొంచువచ్చె నేమి తాఁగొనిపోవు
బుట్టువేళ నరుఁడు గిట్టువేళ
ధనము లెచట కేఁగు దానెచ్చటికి నేఁగు విశ్వ. 41

టీ. విశ్వ...వేమ, ఏమి = దేనిని. కొంచు=తీసికొని, వచ్చెన్ = వచ్చెను. ఏమి, తాన్ = తాను కొనిపోవు = కొనిపోవును పుట్టువేళ = పుట్టినప్పుడు, నరుఁడు = మానవుఁడు, గిట్టువేళ=చచ్చువేళ, ధనములు = సంపదలు. ఎచటికి = ఎక్కడికి, ఏఁగు = ఏగును, తాన్ = తాను. ఎచ్చటికి, ఏఁగు.

తా. మానవుఁడు పుట్టినప్పుడేమితీసుకొని వచ్చును, చచ్చునప్పుడేమి తీసుకొని పోవును. ఈసంపదలెక్కడికి పోవును. తానెక్కడికిపోవును.

ఆ. తనువ దెవరిసొమ్ము తనదని పోషించు
ద్రవ్యమెవరిసొమ్ము దాచుకొనఁగ
బ్రాణమెవరిసొమ్ము పారిపోకను నిల్వ విశ్వ. 42

టీ. విశ్వ...వేమ, తనువు = శరీరము. ఎవరిసొమ్ము=ఎవరియొక్క ధనము, తనదని=తనదియని; పోషింప = పోషించుటకు, ద్రవ్యము = ధనము, ఎవరిసొమ్ము, దాచుకొనఁగా = దాచుకొనుటకు, ప్రాణము=జీవము, ఎవరిసొమ్ము, పారిపోకను=మనలను విడిచిపోకుండ, నిల్వ = నిల్చుటకు

తా. ఈశరీర మెవరిసొమ్ము, ఈద్రవ్యమెవరిది. ప్రాణముపోకుండే నిల్పుట కెవ్వరిసొమ్ము.

ఆ. పెట్టిపోయలేని వట్టినరులు భూమి
బుట్టనేమి వారు గిట్టనేమి
పుట్టలోనఁ జెదలు పుట్టవా గిట్టవా విశ్వ. 43

టీ. విశ్వ...వేమ, పెట్టిపోయలేని = దానము చేయని, వట్టినరులు = ప్రయోజనములేని మానవులు, పుట్టనేమి= పుట్టిననేమి, వారు, గిట్టనేమి = చచ్చిననేమి, పుట్టలోన = పుట్టయందు, చెదలు = చెదపురుగులు, పుట్టవా = పుట్టవా, గిట్టవా = చావవా.

తా. దానముసేయని వట్టినరులు పుట్టిననేమి, గిట్టిననేమి. పుట్టలలోఁ జెదపురుగులు పుట్టుటలేదా? చచ్చుటలేదా!

—* అన్నదానము *—

ఆ. అన్నిదానములను అన్నదానమె గొప్ప
కన్నతల్లికంటె ఘనము లేదు;
ఎన్న గురునికన్న నెక్కుడు లేదయా విశ్వ. 44

టీ. విశ్వ...వేమ అన్నిదానములను = అన్నిదానములలోను, అన్నదానమె,గొప్ప = శ్రేష్ఠము. కన్నతల్లికంటె, ఘనములేదు = గొప్పదిలేదు, ఎన్న = ఎన్నగా, గురునికన్న = గురునికంటె, నెక్కువ లేదయా = ఎక్కువలేదు.

తా. అన్ని దానములలోను అన్నదానము శ్రేష్ఠము. కన్నతల్లి కంటెను. గురునికంటెను నెక్కువ దేనియు లేదు.

—: ఆ శ :—

ఆ. ఆశచేత మనుజు లాయువు గలనాళ్లు
తిరుగుచుందురు భ్రమ ద్రిప్పలేక
ముఱికి భాండమందు మునురు నీఁగలభంగి విశ్వ. 45

టీ. విశ్వ...వేమ ఆశచేత = ఆశవలన, మనుజులు = మనుష్యులు ఆయువు = ఆయుర్దాయము, గలనాళ్ళు=ఉన్నంతవరకు, భ్రమ = కోరిక, త్రిప్పలేక = విడువలేక, ముఱికి = దుర్వాసన, భాండమందు, కుండయందు, మునురు = కూడు, ఈగల, భంగి = వలెను, తిరుగుచుందురు.

తా. మానవులు భ్రమ త్రిప్పలేక ఆయువు యున్ననాళ్ళు ముఱికి కుండలో మునురు ఈగలట్లు తిరుగుచుందురు.

ఆ. నీళ్ళలోని మీను నెఱిమాంసమాశించి
గాలమందు జిక్కు కరణి భువిని
ఆశ దగిలి నరుఁడు నాలాగె చెడిపోవు విశ్వ. 46

టీ. విశ్వ...వేమ. నీళ్ళలోన = నీటియందు, మీను = చేప, నెఱి మాంసమె, ఆశించి = కోరి గాలమందు = గాలమున,చిక్కుకరణి = చిక్కుకొను విధమున, భువిని = భూమియందు, ఆశ = ఆశయందు, తగిలి, = తగుల్కొని, నరుడు, అలాగే = అట్లె, చెడిపోవు = నశించును.

తా నీటియందు చేప మాంసమున కాశించి, గాలమునకు జిక్కుకొనునట్లు, మానవుఁడాశయందు దగుల్కొని చెడిపోవును.

ఆ. ఆశ పాపజాతి అన్నిటికంటెను
ఆశచేత యతులు మోసపోరె
చూచి విడచువారు శుద్ధాత్ములెందైన విశ్వ. 47

టీ. విశ్వ...వేమ. ఆశ = ఆశ. పాపజాతి = పాపపుతెగలోనిది, అన్నిటికంటెను, ఆశచేత = ఆయాశచేత, యతులు = యోగులు, మోస

పోరె = మోసపోలేదా, చూచి = చూచి, విడుచువారు = వదలువారు శుద్ధాత్ములు = మంచి మనస్సుగలవారు.

తా. అన్నిటియందును ఆశ మిగులపాపముగలది. దానిచేత రోగులు కూడ మోసపోయివారు. కావున దానినెఱిగి విడుచువారు మంచివారు.

ఆ. ఆశకోసి కోసి యనలంబు చల్లార్చి
గోఁచి బిగియగట్టి గుట్టు దెలిసి
నిలిచినట్టివాఁడె నెఱయోగి యెొందైన విశ్వ. 48

టీ. విశ్వ... వేమ, ఆశ=ఆశను, కోసి కోసి...అనలఁబు = అగ్నిని (ఆశయను నగ్నిని,) చల్లార్చి, = చల్లార్చి, గోఁచి, బిగియగట్టి = గట్టిగాగట్టుకొని, గుట్టుతెలిసి = ఈ జన్మముయొక్క రహస్యము నెఱిగి, నిలిచినట్టివాడె=ఉన్నవాఁడే, ఎందైన = ఎక్కడనైన, నెఱయోగి = యతీశ్వరుఁడు.

తా. ఆశయను నగ్నిని చల్లార్చి గోచి బిగించి, మానవ రహస్యమును తెలిసికొనినవాఁడే యోగి.

ఆ. చచ్చిపడిన పశువు చర్మంబు కండలు
పట్టి పెఱికి తినును పరగ గ్రద్ద
గ్రద్దవంటివాఁడు గజపతి కాఁడొకో విశ్వ. 49

టీ. విశ్వ...వేమ, చచ్చిపడిన = చచ్చిపోయిన, పశువు = పశువుయొక్క, చర్మంబు = చర్మమును, కండలు, పట్టి పెఱికి = లాగి, తినును = భుజించును, పరగ = ఒప్పుగా గ్రద్ద; గ్రద్దవంటివాఁడు= ఆగ్రద్దవంటి వాఁడు గజపతి = ధనమున్నవాఁడు, కాఁడొకో = కాదా

తా. ధనము కలిగి యాసకలవాఁడు చచ్చిన పశువుల కండల పీక్కితిను గ్రద్దవంటివాఁడు.

ఆ. కనకమృగము భువిని గద్దు లేదనకను
దరుణి విడచి చనియె దాశరథియు
దెలివి లేనివాఁడు దేవుడెట్లాయెరా విశ్వ. 50

టీ విశ్వ... వేమ, కనకమృగము = బంగారపులేడి, భావిని = భూమిలో కద్దు=కలదు, లేదు అనకను = ఆలోచింపకుండ, తరుణిని = భార్యను, విడిచి=వదలి, చనియె=వెళ్ళెను దాశరథి = రాముడు, తెలివితేలివాడు= యోచన లేనివాడు దేవుడెట్లాయెగా = దైవమెట్లయ్యెను.

తా. బంగారపు లేడి ఉన్నదా లేదా యని ఆలోచించకుండా రాముడు భార్యను విడచి వెళ్ళెను. ఇతడు దైవమెట్లయ్యెను ?

—: భో గ భా గ్య ము :—

ఆ. అలను బుగ్గపుట్టినప్పుడే క్షయమౌను
గలను గాంచు లక్ష్మిఁ గనుటలేదు
ఇలను భోగభాగ్య మీతీరు గాదొకో విశ్వ. 51

టీ. విశ్వ... వేమ-అలను = అలయందు, బుగ్గ = బుడగ, పుట్టినప్పుడే = కలిగిన వెంటనే, క్షయమౌను = నశించును, కలను = కలలో, గాంచు = చూచెడి లక్ష్మి = సంపద, కనుట లేదు = అనుభవించుట లేదు. ఇలను = భూమిని, భోగభాగ్యము = భోగము, సంపద ఈతీరు కాదొకో = ఇటు కాదా.

తా భోగభాగ్యములు అలయందు బుట్టినప్పుడే నశించు బుడగల వంటివి.

ఆ. కోతినొనరదెచ్చి కొత్త పట్టముగట్టి
కొండముచ్చు లెల్ల గొలిచినట్లు
నీతిహీనునొద్ద నిర్భాగ్యులుండుట విశ్వ. 52

టీ, విశ్వ... వేమ-కోతి = కోతిని, ఒనర = ఒప్పుగా, దెచ్చి, కొత్త= నూతనమైన, పట్టముగట్టి = రాజ్యాభిషేకము జేసి, కొండముచ్చులు=కొండ ముచ్చులు, ఎల్ల = అన్నియు, గొలిచినట్లు = సేవించినట్లు నీతిహీనునొద్ద = జ్ఞానములేనివానియెద్ద, నిర్భాగ్యులు = నిర్భాగ్యులు. ఉండుట.

తా. జ్ఞానహీనుల యొద్ద నిర్భాగ్యులుండుట, కోతికి బట్టముగట్టి కొండముచ్చులు గొలిచినట్లు.

ఆ. కల్లలాడువాని గ్రామకర్త యెఱుంగు
సత్యమాడువాని స్వామి యెఱుఁగు
బెక్కుతిండిపోతుఁ బెండ్లా మెఱుఁగురా విశ్వ 53

టీ. విశ్వ... వే. కల్లలాడువాని = అబద్ధము చెప్పువానిని, గ్రామకర్త = గ్రామాధికారి ఎఱుఁగు = ఎఱుఁగును, సత్యమాడువానిని = నిజము పల్కువానిని, స్వామి = భగవంతుఁడు. ఎఱుఁగును, బెక్కు = అనేకములు తిండిపోతు = తినువానిని, పెండ్లాము ఎఱుఁగు = ఎఱుఁగును.

తా. కల్లలాడువాని గ్రామాధికారి యెఱుఁగును. నిజము బల్కువానిని దైవ మెఱుఁగును. తవతిండి భార్య యెఱుఁగును.

ఆ. కల్ల నిజము లెల్ల గరకంఠుఁ డెఱుఁగును
నీరు పల్ల మెఱుఁగు నిజముగాను
దల్లి తానెఱుఁగును దనయుని జన్మంబు విశ్వ. 54

టీ. విశ్వ... వేమ-కల్ల నిజములు = అబద్ధములు, నిజములు, ఎల్ల = అన్నియూ, కరకంఠుఁడు = ఈశ్వరుఁడు, ఎఱుఁగును నీరు = జలము, పల్ల మెఱుఁగును = పల్లము నెఱుఁగును, నిజముగాను. తల్లి, తాన్ = తాను, ఎఱుఁగును, తనయుని = కుమారుని జన్మంబు = పుట్టుక.

తా. నిజానిజములు ఈశ్వరునకుఁ దెలియును. నీరు పల్లము నెఱుఁగును, తనకుమారుని పుట్టుక తల్లికి దెలియును.

ఆ. మైలకోకతోడ మాసిన తలతోడ
ఒడలు ముఱికితోడ నుండెనేని
అగ్రకులజుఁడైన నట్టిట్టు పిల్తురు విశ్వ. 55

టీ. విశ్వ... వేమ, మైలకోకతోడ = శుభ్రముగాని వస్త్రముతోడ, మాసినతలతోడ = మాసినశిరస్సుతోడ, ఒడలు = శరీరము, ముఱికితోడ, నుండెనేని = ఉన్నచో అగ్రకులజుఁడైన = ఎక్కువకులములో బుట్టినవాఁడైనను. అట్టిట్టు = ఎక్కువగౌరవముగ, పిలువరు.

తా. మైలవస్త్రములతోడను, మాసినతలతోడను, మురికిపండ్లతోడను గమనించినచో మంచికులముగలవానినైనను గౌరవముగజూడరు.

ఆ. చెట్టుపాలు జనులు చేదందు రిలలోన
ఎనుపగొడ్డుపాలదెంత హితవు
పదుగు రాడు మాట పాటింప నిజముయా విశ్వ. 56

టీ. విశ్వ... వేమ, చెట్టుపాలు=చెట్టుయొక్కపాలు, చేదు=చేదని అందురు. ఇలలోన=భూమియందు. ఎనుపగొడ్డు=గేదె. పాలు అదెంత = అదియేమి, హితవు=ఇష్టము, పదుగురు=పదిమంది. ఆడుమాట పాటింప = పాటిచేయుట, నిజముయా=నిజమగును.

తా. చెట్టుపాలు చేదందురు. గేదెపాలు తీపియందురు, పదిమంది మాటయే పాటి సేయుట మేలు.

ఆ. ఉప్పులేనికూర యూనంబు రుచులకు,
పప్పులేనితిండి ఫలములేదు,
అప్పులేనివాఁడె యధికసంపన్నుఁడు విశ్వ. 57

టీ. విశ్వ... వేమ ఉప్పులేని, కూర. యూనంబు = హీనము రుచులకు, పప్పులేనితిండి ఫలములేదు=సార్థకములేదు, అప్పులేనివాఁడె, అధిక సంపన్నుఁడు=ఎక్కువభాగ్యశాలి.

తా. ఉప్పులేనికూర పప్పులేని భోజనము సార్థకములేక హీనము అప్పులేనివాడే అందరికన్నను భాగ్యశాలి.

ఆ. పట్టుపట్టరాదు పట్టివిడువరాదు
పట్టెనేని బిగియఁ బట్టవలయుఁ
బట్టువిడుటకన్నఁ బరగఁ జచ్చుట మేలు విశ్వ. 58

టీ. విశ్వ... వేమ, పట్టు = ఏదైనను పని చేయవలయుననుదీక్ష, పట్టరాదు = వహింపరాదు. పట్టి=అట్టిదీక్షను వహించి, విడువరాదు = వదలరాదు పట్టెనేని= వహించినచో బిగియ = గట్టిగా, పట్టవలయును= వహింపవలయును, పట్టి=వహించి, విడుటకన్న=విడుచుటకన్న, పరగ = ఒప్పుగా చచ్చుట, మేలు=మంచిది.

తా. ఏదైన కార్యము చేయవలెనని వచ్చినప్పుడుముందు పట్టుదల వహింపరాదు. వహించిన పిదప వదలరాదు. దీక్షవహించి వదలుట కన్న చచ్చుట మంచిది.

ఆ. అనఁగ ననఁగ రాగ మతిశయిల్లుచు నుండు
దినఁగ దినఁగ వేము తీపి గలుగు
సాధనమునఁ బనులు సమకూరు ధరలోన విశ్వ. 59

టీ. విశ్వ...వేమ - అనఁగనఁగ = అనఁగా అనఁగా, రాగము అతిశయిల్లుచునుండు = వృద్ధిబొందుచుండు, తినఁగ తినఁగ = తినఁగా తినఁగా, వేము = వేప తీపు = తియ్యదనము. కలుగును సాధనమున = ప్రయత్నమున, పనులు=కార్యములు ధరలోన = భూమిలోన సమకూరు = కొనసాగును.

తా. అనఁగా అనఁగా రాగము బయలు దేరును. తినఁగా తినఁగా వేపతియ్యగానుండును. ఏకార్యమైనను ప్రయత్నమువలన గొనసాగును.

ఆ. తప్పులెన్నువారు తండోపతండంబు
లుర్విజనులకెల్ల నుండు దప్పు
తప్పులెన్నువారు తమ తప్పు లెఱుఁగరు విశ్వ. 60

టీ. విశ్వ...వేమ-తప్పులు = దోషములు. ఎన్నువారు = లెక్కపెట్టువారు, తండోపతండంబులు = అనేకమంది, ఉర్వి = భూమిని జనులకెల్ల = అందరికి. ఉండున్ = ఉండును. తప్పు = తప్పులు ఎన్నువారు=లెక్కపెట్టువారు, తమ తప్పులెఱుగరు.

తా. తప్పులెన్నువారనేకులుందురు. ప్రతివానికి దప్పుండును, ఇతరుల తప్పులనెన్నువారు తమతప్పులెఱుగరు.

ఆ. తనకుఁగల్గు పెక్కు తప్పులునుండఁగా
ఓగుజేరములెంచు నొరులఁగాంచి
చక్కిలంబుఁగాంచి జంతికి నగినట్లు విశ్వ. 6,

టీ. విశ్వ... వేమ తనకు=తనకు కగ్గ = ఉన్న, పెక్కు = ఎక్కువ, తప్పులు ఉండఁగా=కలుగఁగా, కీగు=చెడ్డవాఁడు, నేరము = దోషము, ఎంచు = లెక్క పెట్టును, ఒరుల = ఇతరుల, కాంచి = చూచి, చక్కిలాంబుగా = చక్కిలంబును, కాంచి = చూచి, జంతిక నగినట్లు = నవ్వినట్లు.

తా. చెడ్డవాఁడు తనవద్దఁ పెక్కు తప్పులుండఁగా, చక్కిలమును గాంచి జంతిక నవ్వినట్లు, ఒరులతప్పుల నెంచును.

ఆ. ఇనుము విఱిగెనేని యినుమాఱు ముమ్మాఱు
కాచి యతుక వచ్చుఁ గ్రమముగాను
మనసు విఱిగెనేని మఱి చేర్చరాదయా విశ్వ. 62

టీ. విశ్వ... వేమ-ఇనుము = ఇనుము. విఱిగెనేని = విఱిగినచో, ఇనుమాఱు = రెండు సార్లు ముమ్మారు = మూఁడుసార్లు, కాచి, అతుక వచ్చు = అతికించవచ్చు క్రమముగాను, మనస్సు = చిత్తము, విఱిగెనేని=విఱిగినచో మఱి చేర్చరాదయా = కుదురపఱచలేము.

తా. ఇనుము విరిగినచో, రెండుమూఁడు సారులు కాచి యతికించ వచ్చును గాని మనస్సు విఱిగినచో మరల కుదురుపఱచజాలము.

ఆ. ఒకనిఁ జెఱచెదమని యుల్లమందెంతురు
తమదు చేటెఱుఁగరు ధరను నరులు
తమ్ము జెఱుచువాఁడు దైవంబు గాఁడొకో విశ్వ. 63

టీ విశ్వ... వేమ. ఒకనిఁ = ఒకనిని, చెఱిచెదమని = చెఱచుటకు, ఉల్లమందు = మనస్సులో, ఎంతురు = తలఁతురు, తమదు = తమ యొక్క, మనుష్యులు తమ్ము చెఱచువాఁడు దైవంబు = దేవుఁడు, కాఁడొకో = కాఁడా ?

తా. కొందఱు ఇతరులను చెరచుటకు దలంతురుగాని తమ్ము చెరచువాఁడు దైవమున్నాఁడని యెఱుగరు.

ఆ. చంపఁదగినయట్టి శత్రువు తనచేతఁ
జిక్కెనేని కీడు సేయరాదు
పొసఁగ మేలు చేసి పొమ్మనుటే చాలు విశ్వ

టీ. విశ్వ... వేమ. చంప = చంపుటకు, తగినట్టి శత్రువు=విరోధి. తనచేత = తనచేతికి చిక్కెనేని = కీడు=అపాయము సేయరాదు పొసఁగ = ఒప్పుగా, మేలు చేసి, పొమ్మనుటే= వెళ్ళుమనుటయే చాలు

తా. చంపఁదగిన శత్రువు తనకుఁ జిక్కినను కీడు సే చేసి పొమ్మనుట మంచిది.

ఆ. మాటలాడనేర్చి మనసు రాజిలఁజేసి
పరగఁ బ్రియముచెప్పి బడలకున్న
నొకరి చేతి సొమ్ము లూరక వచ్చునా విశ్వ.

టీ. విశ్వ... వేమ, మాటలు = పలుకులు. ఆడ = పలి కొని, మనస్సు = చిత్తము రాజిలగ =రంజిల్లజేసి పరగ=ఒప్పుగా ప్రియము=హితము, చెప్పి, బడలకున్న. ఒకరిచేతిసొమ్ములు = ఇం నున్న సొమ్ములు. ఊరక వచ్చునా?

తా. ఒకరిదగ్గరనున్న సొమ్ము ఇంకొకరిదగ్గరకు వచ్చు మనస్సు రంజింపజేసినగాని వూరకరాదు.

ఆ. కానివానిచేతఁ గాసువీసం బిచ్చి
వెంటఁ దిరుగువాఁడె వెఱ్ఱివాఁడు
పిల్లితిన్న కోడి పిలిచిన పలుకునా విశ్వ.

టీ. విశ్వ... వేమ కానివానిచేత=హీనుని చేతికి, కాస ఇచ్చి=ఇచ్చి, వెంట =(వాని) వెంట, తిరుగువాఁడు, వె అవివేకి, పిల్లి తిన్న=తినిన కోడి పిలిచిన, పలుకునా = మాట్లాడు

తా. హీనుని చేతిలో డబ్బుపెట్టి వానివెంటఁ దిరుగు వెఱ్ఱివాఁడు. పిల్లిచే తినబడిన కోడి పలుకునా?

ఆ. వానకురియకున్న వచ్చును క్షామంబు
వాన గురిసెనేని వఱద పాఱు
వఱద కఱువు రెండు వరుసతో నెఱుఁగుడి విశ్వ. 67

టీ. విశ్వ... వేమ. వానకురియకున్న = వాన కురియకున్నచో, వచ్చును = వచ్చును, క్షామంబు = కఱవు వానగురిసెనేని = వానగురిసినచో, వరదపాఱు = వరద కలుగును. వరద, కఱవు రెండును, వరుసతో నెఱుఁగుడి = వచ్చునని ఎఱుఁగుడు.

తా. వర్షము లేకున్న కఱువు, వర్షమున్నచో వరద, రెండును వచ్చునని తెలియుఁడు.

ఆ. పుట్టిన జనులెల్ల భూమిలోనుండినఁ
బట్టునా జగంబు పట్టదెపుడు
యముని లెక్క రీతి నరుగుచునుందురు విశ్వ. 68

టీ. విశ్వ... వేమ- పుట్టి జనులెల్ల = పుట్టినవారందఱు, భూమిలో = భూమిపైన, ఉండినన్ = ఉన్నచో, పట్టునా, జగంబు = లోకము, పట్టదు, ఎప్పుడు. యముని = యమధర్మరాజుయొక్క. లెక్కరీతి = లెక్కప్రకారము. అరుగుచుందురు = చనిపోవుచుందురు.

తా. పుట్టిన వారెల్ల భూమియందున్నచో లోకము పట్టదు. యముని లెక్కప్రకారము అందఱుపోవుచుందురు.

ఆ. వానరాకడయును బ్రాణంబు పోకడ
కానఁబడ దదెంత ఘనునికైన
గానఁబడినమీఁదఁ గలియెట్లు నడచురా విశ్వ. 69

టీ. విశ్వ... వేమ, వానరాకడయును = వర్షము వచ్చుటయును. ప్రాణంబుపోకడ = ప్రాణము పోవుటయును, కానఁబడదు = కనుపించదు ఎంత = ఎట్టి, ఘనునికైన = గొప్పవానికైన కానఁబడినమీఁద = కనిపించినపిదప, కలి= కలియుగము. ఎట్లు=ఏవిధమున, నడచురా = నడచును.

తా. వానవచ్చుటయు ప్రాణము పోవుటయు ఎంతఘనునికైనా తెలియుదు. అది తెలిసిన కలికాలము ఎట్లు నడచును.

ఆ. చిప్పబడ్డ స్వాతిచినుకు ముత్యంబాయె
నీటబడ్డ చినుకు నీటఁ గలిసెఁ
బ్రాప్తిగల్గుచోట ఫలమేల తప్పురా విశ్వ. 70

టీ. విశ్వ...వేమ, చిప్పబడ్డ=చిప్పయందుపడిన, స్వాతిచినుకు = స్వాతి వానచినుకు ముత్యంబాయె (ముత్యంబు + ఆయె) = ముత్యంబయ్యెను; నీటఁబడ్డ = నీటియందుపడిన, చినుకు, నీటగలిసె = నీటిలోఁ గలిసెను; ప్రాప్తి = కార్యమగుట, కల్గుచోట = అయోగ్యస్థలమున్న, ఫలమేల = ఫలమెందుకు, తప్పురా = తప్పును.

తా. స్వాతి వానచినుకు చిప్పయందుఁ బడినచో ముత్యమగును నీటబడినఁ గలసిపోవును. ప్రాప్తియున్నచో ఫలమెట్లు దప్పును.

ఆ. ఎన్నిచోట్లు తిరిగి యేపాట్లు పడినను
అంటనియ్యక శని వెంటఁదిరుగు
భూమి క్రొత్తలైన భుక్తులు క్రొత్తలా విశ్వ. 71

టీ. విశ్వ...వేమ ఎన్నిచోట్లు = ఎన్నిస్థలములు, తిరిగి = సంచరించి, ఏపాట్లుపడినను = ఎట్టికష్టములు పడినను, అంటనియ్యక = పొందనియ్యక, శని, వెంట = వెంటనే, తిరుగును, భూమి = భూమి, క్రొత్తలైన = క్రొత్తయైన భుక్తులు = తినుటలు, క్రొత్తలా.

తా. ఏస్థలములు తిరిగినను, ఏకష్టములు పడినను ఏమియుఁ బొందనీయక శని వెన్నంటుచునేయుండును భూమి క్రొత్తయైన భుక్తి క్రొత్తదా.

ఆ. అనువుగానిచోట నధికులమనరాదు
కొంచెమైన నదియు గొదువకాదు
కొండయద్దమందు గొంచమై యుండదా విశ్వ. 72

టీ. విశ్వ...వేమ-అనువుగానిచోట = వీలులేని ప్రదేశమున, అధికులము = గొప్పవారమని, అనరాదు = పలుకరాదు, కొంచమైన, అదియు

అది, కొదువగాను = కొఱతగాదు, కొండ, అద్దమందు = అద్దములోన కొంచెమై యుండదా = కొంచెముగా నుండదా.

తా. నీచుగాని స్థలమున మన పధికులమని చెప్పుకొనరాదు. కొంచెమువారమన్నను కొఱతలేదు. అద్దమందు కొండ చిన్నదిగ గనుపించదా.

ఆ. ఇమ్ముదప్పువేళ నెమ్మె లెన్నియు మాని
కాలమొక్కరీతి గడపవలయు
విజయుఁ డిమ్ము దప్పి విరటుని గొల్వఁడా విశ్వ. 73

టీ. విశ్వ...వేమ, ఇమ్ము=స్థానము, తప్పువేళ = తప్పుసమయమున, ఎమ్మెలు = విషయములు, అన్నియును, మాని = విడిచి కాలము, ఒక్కరీతి= ఒకరీతిగా, గడపవలయు = పుచ్చవలయును, విజయుఁడు = అర్జునుఁడుఁ ఇమ్ము = స్థానము తప్పి=విడిచి, విరటుని = విరటరాజును, కొల్వఁడా = సేవింపఁడా.

తా. స్థానముతప్పినపుడు విషయములన్నియు విడచి కాలమును గడపవలయును. అర్జునుఁడు విరటుని గొలువలేదా.

ఆ. కర్మమధికమయిన గడచిపోవగరాదు
ధర్మరాజు దెచ్చి తగనిచోట
గంకుభట్టుఁ జేసెఁ గటకటా దైవంబు విశ్వ. 74

టీ. విశ్వ...వేమ-కర్మము = తాను చేసినకర్మము. అధికమయిన = ఎక్కువయినచో, గడచిపోవగరాదు = దాటవలనుపడదు, ధర్మరాజు = ధర్మరాజును, తెచ్చి, తగనిచోట =యతఁడుండదగని స్థలమున, కంకుభట్టు = కంకుభట్టుగా, దైవంబు = దేవుఁడు, గటకటా = అయ్యయ్యో జేసెఁ = జేసెను.

తా. కర్మమును నెవ్వరు గడుపజాలరు. అంతటివాఁడైన ధర్మరాజును దైవము గంకుభట్టుగఁజేసి విరటుని గొలిపించినాడు.

ఆ. లక్ష్మియేలినట్టి లంకాధిపతిపురి
పిల్లకోతి పౌజు కొల్లపెట్టె
చేటుకాలమయినఁ జెఱుప నల్పులెజాలు విశ్వ. 75

టీ విశ్వ... వేమ, లక్ష్మి లక్ష్మీదేవి, ఏలినట్టి = పరిపాలించిన. లంకాధిపతిపురి = రావణుని పురమగు లంక. పిల్లకోతిపౌజు = చిన్న కోతులగుంపు, కొల్లపెట్టె=దోచెను చేటుకాలమున=వినాశమగు కాలము వచ్చినచో, చెఱుప=చెఱుచుటకు. అల్పుఁడే=చిన్నవాఁడే. చాలు,

తా. లక్ష్మియేలిన లంకను పిల్లకోతులగుంపు కొల్లగొట్టెను. కాలము సమీపించినచో ఎంత బలవంతులైనను పంచుటకు అల్పుఁడేచాలును.

ఆ. చిక్కియున్న వేళ సింహంబునైనను
బక్కకుక్క కఱచి బాధచేయు
బలిమిలేనివేళఁ బంతబు చెల్లదు విశ్వ 76

టీ. విశ్వ... వేమ, చిక్కియున్నవేళ=బలము, తగ్గియున్న సమయమున, సింహంబునైనను = సింహమునైన, బక్క, కుక్క కఱచి, బాధచేయు= కలిగించును. బలిమి=బలము లేనప్పుడు పంతము చెల్లదు=సాగదు.

తా. బలము లేనప్పుడు సింహమునైనను బక్కకుక్క కఱచి బాధకలిగించును. బలము లేనప్పుడు పంతము చెల్లదు.

ఆ. మొదటనాశబెట్టి తుదలేదు పొమ్మను
పరమలోభులైన పాపులకును
నుసురు తప్పకంటు నుండేలు దెబ్బగా విశ్వ. 77

టీ. విశ్వ... వేమ, మొదట = తొలుత, ఆశపెట్టి = ఆశకలిగించి తుద=చివరకు, లేదుపొమ్మను=పొమ్మనును, పరమలోభులైన = మిక్కిలి లోభులైన. పాపులకును=పాపాత్ములకును, ఉసురు=ఉసురు, తప్పక = తప్పకుండ, ఉండేలుదెబ్బగా=ఉండేలుదెబ్బవిధమున, అంటు = అంటును.

తా. మొదట నాశపెట్టిన తరువాత లేదుపొమ్మనుట లోభులకు సహజము ఉండేలుదెబ్బగా తగిలీను.

ఆ. ఇచ్చువానియొద్ద నీయనివాఁడున్నఁ
జచ్చుగాని యీవి సాగనీఁడు
కల్పతరువుక్రింద గచ్చపొదున్నట్లు విశ్వ. 78

టీ. విశ్వ...వేమ. ఇచ్చువానియొద్ద = దానము చేయువానియొద్ద, ఈయనివాఁడు = లోభి. ఉన్న = ఉండిన, చచ్చుగాని = చచ్చుగాని ఈవి = ఇచ్చుట, సాగనీడు = చేయనీయఁడు. కల్పతరువుక్రింద = కల్పవృక్షము క్రింద, గచ్చపొద ఉన్నట్లు

తా. కల్పవృక్షము క్రింద గచ్చపొద యున్నట్లు ధర్మవంతుని దగ్గఱ లోభియున్నచో ధర్మము చేయనీయఁడు.

ఆ. అరయ నాస్తియనక యడ్డుమాటాడక
తట్టుపడక మదిని దన్నుకోక
తనది గాదనుకొని తాఁబెట్టునదె పెట్టు విశ్వ. 79

టీ. విశ్వ...వేమ. అరయ = అరయఁగా, నాస్తియనక = లేదనక, అడ్డుమాటాడక = అడ్డుచెప్పక, తట్టుపడక = తొట్రుపాటుపడక, మదిని = మనస్సులో, తన్నుకోక, తనది కాదనుకొని = కాదనియెంచి, తాన్ = తాను, పెట్టునది = ఇచ్చునది. పెట్టు = ఈవి.

తా. లేదనకుండ, తొట్రుపాటుపడక, మనస్సులో తన్నుకోక తనది కాదనుకొని, పెట్టిన పెట్టే పెట్టు.

ఆ. ధనము కూడఁబెట్టి దానంబుచేయక
తాను దినక లెస్స దాఁచుగాక
తేనెటీఁగ కూర్చి తెఱువరి కియ్యదా విశ్వ. 80

టీ. విశ్వ...వేమ- ధనము = ద్రవ్యము. కూడఁబెట్టి = జాగ్రత్తచేసి దానంబుచేయక = దానముచేయక, తాను, తినక = తినకుండ, లెస్స =

ఎక్కువగా, దాచుగాక = దాచుఁగాని, తేనెటీఁగ, కూర్చి = దాచి, తెరువరికి = బాటసారికి ఇయ్యదా.

తా. లోభి ధనముగూడఁబెట్టి దానము సేయక తాను దినక దాచును. అయ్యది తేనెటీఁగ తేనెను జేర్చి తెరువరికిచ్చినట్లగును.

ఆ. కొంకణంబు పోవ కుక్క సింహముకాదు
కాశికరుగ పంది గజముకాదు
వేఱుజాతివాఁడు విప్రుండు కాలేడు విశ్వ. 81

టీ. విశ్వ... వేమ—కొంకణంబు = కొంకణంబునకు, పోవన్ = పోయిన, కుక్క, సింహముకాదు = మృగరాజు కాదు, కాశికి = కాశికి, అరుగన్ = అరిగిన, పంది, గజము = ఏనుఁగు, కాదు, వేఱుజాతివాఁడు = ఇతరకులమువాఁడు, విప్రుండు = బ్రాహ్మణుఁడు, కాలేడు = కానేరఁడు.

తా. కొంకణమునకు బోయిన కుక్క సింహము గాలేనట్లును, కాశికిబోయినను పంది ఏనుఁగు కానట్లును. ఇతరకులమువాఁడు బ్రాహ్మణుఁడు కానేరఁడు.

ఆ. తవిటి కరయఁబోవ దండులంబుల గంప
శ్వానమాక్రమించు సామ్యముగను
వైశ్యవరుని సొమ్ము వసుధనీచుల కబ్బు విశ్వ. 82

టి. విశ్వ... వేమ-తవిటికి = తవుడును. అరయ = చూచుటకు, పోవ = పోవఁగా, తండులంబులగంప = బియ్యపుగంప శ్వానము = కుక్క, ఆక్రమించు = వశముజేసికొను, సామ్యముగా = విధముగా, వైశ్యవరుని సొమ్ము = కోమటిధనము. వసుధ = భూమియందు, నీచులకు = హీనులకు అబ్బు = లభించును.

తా. తవిటికిబోవ బియ్యపుతట్ట శ్వాన మాక్రమించినట్లు కోమటి సొమ్ము నీచులకు లభించును.

ఆ. దాతకానివాని దఱుచుగా వేఁడిన
వాఁడు దాతయౌనె వసుధలోన
ఆవురు దర్భయౌనె యబ్ధిలోముంచిన విశ్వ. ౮౩

టీ. విశ్వ... శేమ; దాతకానివాని = దానము చేయనివానిని, తఱుచుగా = అప్పుడప్పుడు, వేఁడిన = వేఁడినచో. వాఁడు = అతఁడు, దాతయౌనె = దాతయగునా, వసుధలోన, ఆవురు = ఆవురుగడ్డి అబ్ధిలో = సముద్రములో, ముంచిన = ముంచినను. దర్భయౌనె = దర్భయగునా.

తా. దాతకానివానిని తరుచు అడిగినను దాతకాఁడు. ఆవురుగడ్డి సముద్రములో ముంచిన మాత్రమున దర్భయగునా.

ఆ. పఱుగ ఱాతిగుండు పగులఁగొట్టగవచ్చు
కొండలన్ని బిండి గొట్టవచ్చు
కఠినచిత్తు మనసు కరగింపగా రాదు విశ్వ.

టీ. విశ్వ... శేమ పఱుగ = ఒప్పుగా రాతిగుండు = ఱాతిగుండును, పగులఁగొట్టగవచ్చు = పగులఁగొట్టగవచ్చును, కొండలన్ని = కొండలన్నిటిని, పిండిగొట్టవచ్చు = పిండిగా చేయవచ్చును, కఠినచిత్తుమనసు = కఠినచిత్తుని యొక్క మనస్సు కరిగింపగారాదు = కరిగింపఁజాలము.

తా. ఱాతిగుండును పగులఁగొట్టవచ్చును, కొండలను పిండిచేయ వచ్చును కఠినుని మనస్సుమాత్రము కరగింపబడదు.

ఆ. వంపుకఱ్ఱ కాల్చి వంపు దీర్పఁగవచ్చు
కొండలన్ని బిండి గొట్టవచ్చు
కఠినచిత్తు మనసు కరిగింపఁగారాదు విశ్వ. ౮౫

టీ. విశ్వ... శేమ, వంపుకఱ్ఱ = వంకరగానున్న కఱ్ఱను, కాల్చి వంపు = వంకర, తీర్పవచ్చును = పోగొట్టవచ్చును. కొండలన్ని పిండిగొట్ట వచ్చు. కఠినచిత్తుమనసు కరిగింపఁగారాదు.

తా. కాల్చి కట్టుకున్న వంకర తీర్చవచ్చును. కొండలను పిండి జేయవచ్చును. కాని, కఠినుని మనస్సు కరిగింపలేము.

ఆ. విత్తముఁగలవాని వీఁపు పుండైనను
వసుధలోనఁ జాల వార్త కెక్కు
బేదవానియింటఁ బెండ్లైన నెఱుఁగరు విశ్వ. 86

టీ. విశ్వ... వేమ, విత్తముగలవాని = ధనవంతుని, వీఁపు = వీఁపు పైన, పుండైన = కురుపులేచినచో, వసుధలోన = భూమిలోన, చాల = ఎక్కువగా, వార్త = వార్తను. ఎక్కు = బయలుఁజేరును. పేదవాని యింట = పేదవానియింటిలో. పెండ్లయిన = పెళ్ళియైన, యెరుగరు.

తా. గొప్పవాని వీపుమీఁద కురుపు లేచిఁచో యీవార్త జగమెల్ల వ్యాపించును. పేదవానిఇంట పెళ్ళియైనను ఎవ్వరు చెప్పుకొనరు.

ఆ. ఆపదగల వేళ నరసి బంధులఁజూడు
భయమువేళజూడు బంటుతనము
పేదవేళజూడు పెండ్లాము గుణమును విశ్వ. 87

టీ. విశ్వ... వేమ. ఆపదగలవేళ = ఆపదవచ్చినవేళ, అరసి, బంధువుల = బంధువుల, చూడు = చూడుము, భయమువేళ = భయపడినప్పుడు చూడు = చూడుము, బంటుతనము పేదవేళ = దరిద్రమువచ్చినప్పుడు, చూడు, పెండ్లాము గుణము = భార్యగుణము.

తా. ఆపదవేళ బంధువులను జూడుము, భయపడినప్పుడు, బంటుతనము చూడుము దరిద్రము వచ్చినపుడు భార్యాగుణము చూడుము.

ఆ. ఆలిమాటలువిని యన్నదమ్ములఁబాసి
వేఱెపోవువాఁడు వెఱ్ఱివాఁడు
కుక్కతోఁకబట్టి గోదావరీదునా విశ్వ. 88

టీ. విశ్వ... వేమ, ఆలిమాటలు = భార్యమాటలు, విని = ఆలకించి, యన్నదమ్ములు = అన్నదమ్ములను. పాసి = విడిచి, వేఱె = వేఱే, పోవు

వాఁడు = అరుగువాఁడు, వెఱ్ఱివాఁడు = అవివేకి, కుక్కతోఁక = కుక్కతోఁక, పట్టి = పట్టుకొని, గోదావరి = గోదావరి, ఈదునా?

తా. భార్యమాటలు విని చెడిపోవువాఁడు వెఱ్ఱివాఁడు. కుక్కతోఁక పట్టుకొని గోదావరి ఈదునా.

ఆ. మగని కాలమందు మగువ కష్టించిన
సుతుల కాలమందు సుఖమునందు
కలిమి లేమి రెండు గల వెంతవారికి విశ్వ. 89

టీ. విశ్వ... వేమ, మగనికాలమందు = భర్తయున్నప్పుడు, మగువ = ఆడుది, కష్టించిన = కష్టపడిన, సుతుల కాలమందు = కొడుకుల కాలములో, సుఖము నందు = సౌఖ్యము బొందును, కలిమి = సంపద, లేమి = దరిద్రము, రెండు, కలవు = ఉన్నవి. ఎంతవారికి = ఎట్టివారికైనను.

తా. స్త్రీ మగనికాలములో కష్టపడినచో, సుతుల కాలమున సౌఖ్యములఁ బొందును. కలిమిలేమి లెట్టివారికైన నున్నవి.

ఆ. చెప్పులోనిఱాయి చెవిలోని జోరీఁగ
కంటిలోని నలుసు కాలిముల్లు
ఇంటిలోనిపోరు యింతంతగాదయా విశ్వ. 90

టీ. విశ్వ... వేమ, చెప్పులోనిఱాయి = చెప్పులోపల నుండు ఱాయి. చెవిలోని జోరీఁగ = చెవియందు చేరు ఈఁగ, కంటిలోని నలుసు = కంటిలో బడు నలుసు. కాలిముల్లు = కాలనందుముల్లు. ఇంటిలోని పోరు = ఇంటిలో గలహము, ఇంతంత గాదయా = ఇంతింతయనని చెప్పలేము.

తా. చెప్పులోనిఱాయి, చెవిలో ఈఁగ, కంటిలో నలుసు కాలిలో ముల్లు ఇంటిలో కలహము కడు బాధ కలిగించును.

క. తల్లితండ్రులపయి దయలేని పుత్రుండు
పుట్టనేమి వాఁడు గిట్టనేమి
యింటబుట్టి పెరిఁగి యిల్లాలి బంటురా విశ్వ. 91

టీ. విశ్వ...వేమ తల్లిదండ్రుల పయి = తల్లిదండ్రుల మీఁద, దయలేని పుత్రుండు = దయలేని కొడుకు. పుట్టనేమి = పుట్టిననేమి గిట్టనేమి=చచ్చిననేమి యిట=ఇటువంటి, పుట్టి పెరిఁగి = పెద్దవాఁడై, ఇల్లాలిబంటు రా= భార్యకు బంటు.

తా. తల్లిదండ్రుల పయిన దయలేని కొడుకు బుట్టిననేమి! చచ్చిననేమి! వాఁడు భార్యకు బంటు.

ఆ. తనకు లేనినాఁడు దైవంబు దూఱును
దనకుఁ గల్గెనేని దైవమేల
దనకు దైవమునకు దగులాట మెట్టిదో విశ్వ. 92

టీ. విశ్వ...వేమ, తనకు = తనకు లేనినాఁడు = ఏమియును లేని దినము, దైవంబు = దైవమును, దూఱును = తిట్టును, తనకుఁగల్గెనేని= ఉన్నచో, దైవమేల=దేవుఁడేల, తనకు, దైవమునకు = దైవమునకును దగులాట మెట్టిదో = సంబంధమేమో.

తా. తనకులేనప్పుడు దేవునిదూఱును ఉన్నప్పుడు దైవమేల. దైవమునకు తనకు సంబంధమేమిటికి.

ఆ. మాటలాడుటొకటి మనసులో నొక్కటి
ఒడలిగుణము వేఱె యోజవేఱె
ఎట్టుగల్గు ముక్తి యీలాగు తానుండ విశ్వ. 93

టీ. విశ్వ...వేమ, మాటలాడు టొకటి = పలుకు టొకవిధము, మనములో నొకటి = మనస్సులో మఱియొకవిధము, ఒడలిగుణము= శరీరగుణము వేఱె=మఱియొకతీరు, యోజవేఱె=ఆలోచన వేఱు ఎట్టు = ఏరీతిగ, కల్గు = కలుగును. ముక్తి=మోక్షము, ఈలాగు = ఈతీరున, తానుండు=తానుండఁగా,

తా. మాటయొకటి, మనసొకటి, గుణమొకటి, యోచన యింకొకటిగా నుండువానికి ముక్తి యెట్లు కలుగును ?

ఆ. అంతరంగమందు నపరాధములుచేసి
మంచివాని వలెనె మనుజుఁడుండు,
ఇతరు లెఱుఁగకున్న నీశ్వరుఁడెఱుఁగఁడా విశ్వ. 94

టీ. విశ్వ...వేమ, అంతరంగమునను = మనస్సునందు, అపరాధములు = దోషములు. చేసి= కావించి, మంచివానివలెనే=మంచివానిరీతినే, మనుజుఁడుండును=మనుష్యుఁడుండును, ఇతరులు, ఎఱుఁగకున్న = తెలిసికొనకున్న, ఈశ్వరుఁడు, ఎఱుఁగఁడా?

తా. మనస్సులో అపరాధములు చేసి, మంచివానివలెనే మనుజుండు కానుపించినను వానిని ఈశ్వరుఁడెఱుఁగును.

ఆ. ముచ్చు గుడికిఁబోయి ముడి విప్పనేగాని
పొసఁగ స్వామిఁజూచి మ్రొక్కఁడతఁడు
కుక్క యిల్లుసొచ్చి కుండలు వెదుకదా విశ్వ 95

టీ. విశ్వ...వేమ- ముచ్చు = దొంగ, గుడికి= దేవాలయమునకు, పోయి = పోయి, ముడివిప్పనేగాని=ఎవరికొంగునైన నున్న ధనము విప్పనే గాని, పొసఁగన్ = ఒప్పగా, స్వామిన్ = దేవుని, చూచి, మ్రొక్కఁడు అతఁడు, కుక్క. ఇల్లుసొచ్చి = ఇంటిలోఁబ్రవేశించి, కుండలు వెదుకదా = అన్నపుకుండ వెదకును.

తా. దొంగ దేవాలయమునకుఁ బోయినను మూటలు విప్పుటకే చూచునుగాని, దేవునకు మ్రొక్కఁడు. ఇల్లుఁజొచ్చిన కుక్క, కూటి కుండల వెదకదా.

ఆ. వేషభాషలెఱిఁగి కాషాయవస్త్రముల్
కట్టగానె ముక్తి కలుగఁబోదు
తలలు బోడులైన తలఁపులు బోడులా విశ్వ. 96

టీ విశ్వ...వేమ - వేషభాషలు = వేషము భాషలు. ఎఱిఁగి = గ్రహించి, కాషాయవస్త్రముల్ = కాషాయగుడ్డలు. కట్టగానే = ధరించినంతనే,

ముక్తి = మోక్షము, కలుఁగఁబోదు = కలుగదు, తలలు = శిరములు, బోడులైన, తలంపులు = ఊహాలు, బోడులా.

తా. కాషాయవస్త్రములు ధరించినంతనే ముక్తి రాదు. తలబోడి యైన తలంపులు బోడియగునా ?

ఆ. ఓగు నోగు మెచ్చు నొనరంగ నజ్ఞాని
భావమిచ్చి మెచ్చుఁ బరములుబ్ధు
పంది బురద మెచ్చుఁబన్నీరు మెచ్చునా విశ్వ. 97

టీ. విశ్వ... వేమ- ఓగున్ = పనికిమాలినవానిని, ఓగు = పనికిమాలిన వాఁడు (మూర్ఖుఁడు) మెచ్చున్ = మెచ్చుకొనును, ఒనరంగన్ = తగు నట్లుగా, పరములుబ్ధు = మిగుల లోభియగువాఁడు, అజ్ఞానిన్ = అజ్ఞానము తెలి, వానిని భావమిచ్చి = హృదయమిచ్చి (మనస్సు) మెచ్చున్ = మెచ్చుకొను పంది = వరాహము, బురదన్ = బాడిర. మెచ్చు = మెచ్చుకొనును, కాని, పన్నీరున్ = పన్నీటిని, మెచ్చునా = మెచ్చుకొనునా ? (మెచ్చ కొనఁదనుట.)

తా. మంచి చెడ్డలను మూర్ఖుఁడు తెలిసికొననట్లు, లుబ్ధుఁడు పండితుల నెఱుఁగఁజాలడు.

ఆ. గాజుకుప్పెలోనఁ గడగుచు దీపంబు
దెట్లులుండుజ్ఞాన మట్లులుండుఁ
దెలిసినట్టివారి దేహంబులందును విశ్వ. 98

టీ. వేమ... వేమ, గాజుకుప్పెలోనన్ = గాజు బుడ్డియందు దీపంబు + అది = అదీపము, కడగుచున్ = ప్రకాశించుచు, ఎట్లుండున్ = ఏవిధముగా ప్రకాశించుచుండునో, అట్లు = ఆవిధమున, జ్ఞానము = తెలివి, తెలిసినట్టివారి = జ్ఞానవంతులయొక్క, దేహంబులందును = శరీరములయందును, ఉండున్ = ఉండును.

గాజుబుడ్డియందలి దీప మేవిధముగాఁ జలింపక ప్రకాశించు చుండునో ఆవిధముగానే జ్ఞానుల మనస్సు చలనము లేక యుండును.

ఆ. ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండుఁ
జూడఁ జూడ రుచులఁ జాడవేఱు
పురుషులందుఁ బుణ్య పురుషులు వేఱయా విశ్వ. 99

టీ. విశ్వ...వేమ, చూడన్ + చూడన్ = బాగుగఁజూచినయెడల ఉప్పు = లవణము, కప్పురంబు = కర్పూరము, ఒక్కపోలికన్ = ఒక్కరీతి, గానే, ఉండును = ఉండును [అనగాఁ కనబడునట] రుచులజాడల త్రోవల విధము, వేఱు = వకటిగాదు. పురుషులందున్ = మనుష్యులలో, పుణ్యపురుషులు = పుణ్యాత్ములు, వేఱయా = వక్కవిధముగా నుందరు.

తా. చూపులకు నుప్పుకప్పురము నొక విధముగు వర్ణము కలిగి యుండియును రుచుల భేదముగా నుండునట్లు మనుష్యులలో సుజన దుర్జన భేదమట్లుగా నుండును.

ఆ. అంకి లెఱిఁగి మాటలాడ నేర్చినపుడె
పిన్న పెద్ద తనము లెన్న నేల ?
పిన్న చేతి దివ్వె పెద్దగా వెలుఁగదా విశ్వ. 100

టీ. విశ్వ...వేమ, అంకిలెఱిగి = సాధకబాధకములఁ దెలిసికొని మాటలు + ఆడన్ = పలుకఁగా, నేర్చినపుడె = నేర్చినకాలమందు. పిన్న = చిన్నవాఁడు, పెద్దతనములు = పెద్ద పిన్న అను తారతమ్యములు, ఎన్ననేల = ఆలోచింపగూడదు, పిన్నచేతి దివ్వె = పసిగాని చేతి యందలి దీపము, పెద్దగా = పెద్దదిగా, వెలుఁగదా = ప్రకాశింపదా (ప్రకాశించును.)

తా. ఒక పసియనదు సాధకబాధకములు తెలిసినవాఁడయిన యెడల పసివాఁడైనను అతని మాటను విశ్వసింపవలెను. జ్ఞానము లేకున్న యెడల పెద్దవాఁడైనను, అతని మాటను విశ్వసింపఁగాదు.

ఆ. పదుగురాడు మాట పాటియై ధరఁజెల్లు
నొక్కఁడాడు మాట యెక్కదెందు
ఊరకుండువాని కూరెల్ల నోపదు విశ్వ. 102

టీ. విశ్వ...వేమ, పదుగురు = పలువురు, ఆడుమాట = చెప్పునట్టి మాట, పాటియై = న్యాయము కలదియై, ధరన్ = భూమియందు,

చెల్లున్ = ఒప్పును, ఒక్కఁడు, అడుమాట = చెప్పునట్టిమాట, ఏడఁగా = ఎక్కుడను. ఎక్కుడు = నమ్మతింపబడదు. ఊరకుండువానికిన్ = ఏమియు మాటాడక యుండు నాతనితో, ఊరెల్లన్ = గ్రామమందలి జనుల సముదాయము తయు, ఓపదు = సరికాదు.

తా. పలువురు చెప్పు మాట తప్పయినను సరియని మనుష్యులు యిష్టపడుదురు. కాని ఒక్కఁడు నిజము పలికినను ప్రజలమాట నొప్పుకొనరు. కాబట్టి తెలివిగలవాఁడు వానిని తెలిసికొని యూరకుండుటమంచిది.

ఆ. ధార్మికునకుఁ గాని ధర్మంబుగనరాదు
కష్టజీవికెట్లు గానబడును
నీరు చొరక లోతు నిజముగాఁ దెలియదు విశ్వ. 102

టీ. విశ్వ... వేమ, ధార్మికునకుఁగాని = ధర్మాత్మునకుఁ దప్ప (ఇతరులకు) ధర్మంబు, కనరాదు = తెలిసికొనశక్యము కాదు, కష్టజీవికిన్ = కష్టించి జీవించువానికి, ఎట్లు = ఏవిధముగా, కానబడును = కానవచ్చును, నీరు = నీటియందు, చొరక = దిగక, లోతు = ఆనీటి గంభీరత, నిజముగాన్ = సత్యముగా, తెలియదు.

తా. నీటియందుదిగకుండ ఆనీటియందు లోతు తెలిసికొనఁజాలని విధమున ధర్మము బుద్ధికలవాఁడు గాని సూక్ష్మము తెలిసికొనఁజాలడు.

ఆ. అన్నమడుగనతని కన్నంబుఁ బెట్టిన
పాఱవేయుదాన ఫలితమేమి
ధనికునకు నొసంగు దానంబునటువలె విశ్వ. 103

టీ. విశ్వ... వేమ, అన్నము = భోజనము, అడుగని = కావలయునని కోరని, అతనికిన్ = వానికి, అన్నంబు, పెట్టినన్ = పెట్టినచో, పాఱవేయన్ = అన్నము దినక పాఱవేయును, దానన్ = అట్లుపాఱవేసినందువలన, ఫలితము = ఏమి = ఏ ప్రయోజనము, ధనికునన్ = ధనముగలవానికి, ఒసంగు దానములు = ఇచ్చు దానములు. అటువలె = అట్లే (వ్యర్థమనుట)

తా. ధనముకలవానికి దానమిచ్చుట, ఆకలిలేనివానికి అన్నము పెట్టినట్లు వృధయగును.

జన్మభూమి ప్రెస్, విజయవాడ. 5,000 ప్రతులు.